# జగద్గురు శంకరుల తత్త్వము
# అద్వైతము

శ్రీ విద్యాశంకర భారతీస్వామివారిచే
విరచితము

ప్రకాశకులు :
శ్రీ గాయత్రీ పీఠము, బందరు

సోల్ డిస్ట్రిబ్యూటర్సు:
కమలా పబ్లికేషన్సు
గవర్నరుపేట, విజయవాడ-2.

జగద్గురువులైన శ్రీ ఆదిశంకర భగవత్పూజ్యపాదులకు

## అంకితము

'వ్యుప్త కేశాయచ" అని వేదములో వర్ణింపబడిన ప్రకారము ఆ పరమేశ్వరుని వ్యుప్తకేశరూప కలియుగ జ్ఞానావతారులైనట్టిన్ని,

ఊనషోడశవయఃకాలములో భాష్య ప్రకరణస్తోత్రాది సార్ధశతాధిక అమూల్యగ్రంథరాశిని జగదుద్ధరణార్థమై అనుగ్రహించిన సర్వజ్ఞులైనట్టిన్ని,

అపౌరుషేయములై జ్ఞానపేటికలనదగు ఉపనిషత్తులలోని అద్వైత సిద్ధాంతము నుద్ధరించి ప్రచారముచేసి సర్వ దుర్మతములను ఖండించి అద్వైతమునకు ఆధ్యాత్మిక సామ్రాజ్య పట్టాభిషేకమును గావించి భారతదేశములో చతుర్దిక్కులందును పీఠ చతుష్టయము నమర్చి షణ్మతముల గూడ స్థాపించి జగద్గురువులు అను సార్థక బిరుద విరాజమానులైనటిన్ని,

దయాసముద్రులైనట్టిన్ని,

ఆదిశంకర భగవత్పూజ్యపాదులకు

వారి అనుగ్రహ విశేషముచే రచింపబడిన ఈ చిన్ని పుస్తకమును బద్ధాంజలినై అంకితము చేయుచున్నాడను.

శ్రీ శంకర మఠము
బందరు
కృష్ణామండలము

విద్యాశంకరభారతీస్వామి
శ్రీ గాయత్రీ పీఠము

# శ్రీ జగద్గురు శృంగేరీ శ్రీమదభినవ విద్యా తీర్థస్వామిభిః

అస్మదత్యన్త ప్రియశిష్య పరమహంస శ్రీ గాయత్రీ పీఠాధిపతి శ్రీ విద్యాశంకర భారతీస్వామినాం విషయే ప్రత్యగ్బ్రహ్మైక్యానుసంధాన పూర్వకం విరచితా ఆశిషః సముల్లసంతు.

మీరు పంపిన జగజ్జీవేశ్వరుల తత్త్వము:అద్వైతము అను పేరుగల పుస్తకమును అమూలాగ్రము చూచినాము. గ్రంథము అతి సరళము, సామాన్య జ్ఞానము గలవారును సులభముగా శాస్త్ర ప్రతిపాద్యార్థమును తెలిసికొనుటకు సాధనముగా నున్నది.

జగత్తుమిథ్య, ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము, జీవన్ముక్తి ఈ మూడు విషయములను భగవద్గీత, ఉపనిషత్తులు బ్రహ్మసూత్రములు, విష్ణుపురాణము, శ్రీమద్భాగవతము మున్నగు ప్రాచీనార్ష గ్రంథానుసారముగ నిర్ణయించి బ్రహ్మాద్వైతమే పరమసిద్ధాంతమని యుక్తులు, పదార్థవిజ్ఞానము (సైన్సు) నూతన విమర్శకుల యనుభవ వాక్యములచేతను స్పష్టముగా సిద్ధపడునని చక్కగా బోధపడునటుల వక్కాణించినారు.

ఈ గ్రంథము చూచి సంతోషమును పొందినాము. ఈ గ్రంథము శ్రీశారదాచంద్రమౌళీశ్వరుల అనుగ్రహముచే వర్ధిల్లుగాక!

నారాయణ స్మరణం.

# శ్రీ చంద్రమౌళి

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీ మచ్ఛంకర భగవత్పాదప్రతిష్ఠిత శ్రీ కాంచీకామకోటి పీఠాధిప జగద్గురు శ్రీమచ్చంద్రశేఖరేంద్ర సరస్వతీ శ్రీపాదాదేశానుసారేణ శ్రీమజ్జయేంద్ర సరస్వతీ శ్రీపాదైః శ్రీగాయత్రీపీఠాధిప శ్రీ విద్యాశంకర భారతీస్వామి విషయే క్రియతే నారాయణ స్మృతిః,

శ్లో॥ యద్యప్యద్వైత ఏవ శ్రుతి శిఖరగిరామాగమానాంచ నిష్ఠా
సాకం సర్వైః పురాణైః స్మృతినికర మహాభారతాది ప్రబంధైః
తత్రైవ బ్రహ్మసూత్రాణ్యపి విమృశతాం భాంతి విశ్రాంతిమంతే
ప్రత్నైరాచార్యరత్నైరపి పరిజగృహే శంకరాద్యైస్తదేవ.

తదాయత్తానుగ్రహాదేవ తరుణేందుశిఖామణేః
అద్వైతవాసనా పుంసామావిర్భవతి నాన్యథా॥

ఇతి శ్రీ దీక్షితేంద్రోక్తి మనుసృత్య భవత్కృతః
జగద్గురూణాం చ శత స్త్ర్యాంధ్ర్యం ప్రకాశకః
గ్రంథోయం తత్త్వమద్వైతం బోధయన్ సతతాం సతామ్
శ్రీ చంద్రమౌళికృపయా భూయాత్ శ్రేయఃప్రదస్సదా.

నానాభాష్యాద్భుతాసా సగుణఫలగతిర్వేదవిద్యాభిశేషైః
తత్తద్దేశాప్తిరమ్యా సరిదివ సకలా యత్ర యాత్యంతభూయమ్
తస్మిన్నానందసింధావతిమహతి వశే భావవిశ్రాంతిముద్రా
మాత్రప్రోద్భాసితాయై ప్రణమత హృది తాన్నిత్య
మాచార్యపాదాన్॥

ఇతి చ దీక్షితేంద్రవచన మనుసృత్య సగుణ పరశాస్త్రిణాం సర్వేషామపి సమాగతిః నిగుణే అద్వితీయే పరస్మిన్ తత్త్వే ఏవేతి సమన్వయస్య ప్రదర్శకో భవతి. భవతి కృతజ్ఞ స్సర్వోపి సద్విద్యా లోలుపః రసికలోక ఇతి కిముపవక్తవ్యం

యాత్రాస్థానమ్ ; ఇలైయాత్తంకుడి
శుభకృన్మార్గశీర్ష బహుళ ద్వితీయా. నారాయణ స్మృతిః

ఆమ్నాయార్థవాచస్పతి, వేదభాష్య విశారద. వేదభాష్యాలంకార

బ్రహ్మశ్రీ ఉప్పులూరి గణపతిశాస్త్రిగారి

## ప్రశంస

శ్రీ విద్యాశంకర భారతీ స్వాములవారు రచించిన జగజ్జీవేశ్వర తత్త్వమను గ్రంథమును స్థాలీపులాక న్యాయముగ చూచితిని.

మానవునకు పరమ పురుషార్థ సాధనమగు జగజ్జీవేశ్వర తత్త్వమును, ప్రసంగ సంగత్యాసేన ప్రామాణ్యములను, చక్కని ప్రమాణ వచనములతోను శ్రుతి, యుక్తి, అనుభవములతోను ఉపనిషత్తులు విష్ణుపురాణము, భగవద్గీత, స్కాందపురాణము మొదలగు ఆర్షగ్రంథ వచనములను ఉల్లేఖచేయుచు జన సామాన్యమునకు గూడ సుబోధమగు రీతిని లోకోపకారము కొరకు సులభశైలితో ఇతర మత వైలక్షణ్యములను చూపుచు పరమ పవిత్రమగు హృదయముతో చిన్ననాట నుండియు వారి యనుభవము నంతను శ్రీవారు గ్రంథరూపములో ప్రసాదించిరి.

జన్మాంతరపుణ్యవశమున శ్రీవారితో నాకుపూర్వాశ్రమమునుంచి రమారమి 30 సంవత్సరముల నుంచి పరిచితి గలదు.

చిన్ననాట నుండియు ఈ పుణ్య పురుషులు సంసారములో నుండియు తామరాకుపై నీటివలె సాంసారిక ప్రవృత్తిని గడుపుచు, పరమార్థముకొరకే అహోరాత్రములుతమజీవితమును ధారపోయుచులౌకికములో తాము బి. ఎ. బి.ఎల్., ప్యాసు అయి ప్లీడరుగా పనిచేయుచున్నను నిరంతరము విద్వద్గోష్ఠి సలుపుచు పెద్దలసందర్శనమునకు వ్యయప్రయాసలతో

దూర దేశములకు వెడలి వారి ఆశీర్వాదములను పొందుచు, మహానందమగ్నులగుచు, తరచు ప్రతిదినము సాయంకాలము శాస్త్ర నిష్ణాతులగు పండితప్రకాండులవలన సమస్త పురాణములు, ధర్మములు మున్నగు అనేక విషయములను ఆస్తిక్యముతో వారు గ్రహించుచుండెడివారు.

సంసారములో నున్నంతవరకు కట్లు పరమార్థదృష్టి కోణముతో తమ జీవయాత్రను గడపి, కుమారులయందు సంసార భారమునుంచి, విరక్తులై జగద్గురువుల వద్ద తురీయాశ్రమ స్వీకారమొనర్చి, ప్రస్థానత్రయ భాష్యములను చక్కగా కృషి చేసి సర్వజన సుబోధమగు దృష్టాంతములతో తమ వైదుష్యమును లోకమునకు వెదజల్లుచుండెడి పవిత్ర హృదయులు గాన వీరి రచనలు ఆర్షరచన కోటిలో పరిగణింప దగియున్నవి.

ఇట్టి పవిత్రవ్యక్తుల గ్రంథములు పాఠకులకు పవిత్ర సంస్కారములను కలిగించి ఆత్యంతిక పురుషార్థమునకు సహాకారము లగుచు ఆచంద్రార్కము విరాజిల్లునట్లు పరమేశ్వరుడు అనుగ్రహించు గాక.

— ఉప్పులూరి గణపతిశాస్త్రి

శ్రీ మదఖిలాంధ్ర దేశీయ బ్రాహ్మణ గురుకులాశ్రమ సంస్థాపకులును, సంచాలకులును, సర్వోపద్రష్టలును బ్రహ్మ విద్యాలంకారులును అగు శ్రీ ముదిగొండ వేంకట రామ శాస్త్రిగారి ప్రశంస.

శ్రీ మ త్ప ర మ హం స పరివ్రాజకాచార్యవర్య శ్రీగాయత్రీ పీఠాధిపతులు రచించిన 'జగజ్జీవేశ్వరతత్త్వము అద్వైతము' అను గ్రంథమును చూచి యానందించితిని.

ఇందు ప్రస్థానత్రయా ద్యుదాహరణములనే గాక తుదకు ఇతరభాషలలోని ఖురాన్, బైబిలు, సైన్సు, ఉదాహ రణముల గూడ అద్వైత సిద్ధాంతో పష్టంభకములుగాచూప బడి సరళాంధ్ర భాషలో వివృతములై యుండుటచే అద్వై తాదరము గల నేటి లౌకికుల చిత్తముల గూడ నాకర్షించు టకీ గ్రంథ ముపకరించునని తోచుచున్నది.

శ్రీ విద్యా శంకర భారతీ స్వామివారు పాశ్చాత్య విద్యా నిష్ణాతులై పెద్దలవల్ల ప్రస్థానత్రయ వేదాంతార్థముల నధిగమించి యుండుటచే నిట్టి గ్రంథమును వ్రాసిరి గదా యని సంతసించు చున్నాడ.

ఇట్లు

విద్వద్విధేయుడు

ముదిగొండ వెంకటరామశాస్త్రి.

సికాం: త్రిలింగమహా
విద్యాపీఠము
గవర్నరుపేట
విజయవాడ - 2

# పీఠిక

విశాలాంధ్రపత్రికవారు 1958 సంవత్సరపు 'సందేశం' అనువార్షిక సంచికను అద్వైతము నధికరించి ప్రచురింప దలచి ఒకవ్యాసమును వ్రాయుమని నన్ను కోరగా "జగజ్జీవేశ్వర తత్త్వము" అను శీర్షికతో జగత్తు, జీవుడు, ఈశ్వరుడు అను మూడింటి తత్త్వము అద్వైతమే అని ఒక వ్యాసమును వ్రాసియుంటిని.

దానిలో మన హిందూమతమునకు ప్రమాణగ్రంథ రాజములై ప్రస్థానత్రయము అను నామముతో విరాజమానములగు శ్రీమద్భగవద్గీత, బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు అనువానినిన్ని, పురాణములనున్ను, క్రిస్టియను మతమునకు ప్రమాణగ్రంథమగు బైబిలును, మహమ్మదీయ మతమునకు ప్రమాణగ్రంథమగు ఖురానును విమర్శించి ఆ గ్రంథము లన్నిటిలోను జగజ్జీవేశ్వరతత్త్వము అద్వైతముగానే ప్రధానముగ నిరూపింపబడినదనియు, ఇంతేకాక అందరికి ప్రమాణములగు తర్కయుక్తులనుబట్టి విచారించినను, సైన్సు (Science) అను పదార్థవిజ్ఞానశాస్త్రమును పరిశీలించినను, ప్రాచ్య పాశ్చాత్య మేధాసంపన్నులగు మహాపురుషుల అను

భవములను గమనించినను, జగజ్జీవేశ్వర తత్త్వము అద్వైత ముగానే స్పష్టమగుచున్నదనియు, అట్టి అద్వైత సిద్ధాంతమే ప్రపంచమున కంతకు సనాతనధర్మము [eternal truth] అనియు, అందుకు ద్వైత విశిష్టాద్వైతములు సాధనలనియు శ్రుతియుక్త్యనుభవ పురస్సరముగ వ్రాసియుంటిని. ఇట్టి నా రచనకు ప్రేరణ శ్రీ కామకోటి పీఠాధిపతులగు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ జగద్గురు పూజ్యపాదుల బోధలే. ఆ నా వ్యాసము ఆ వార్షిక సంచికలో ప్రధాన ప్రథమ వ్యాసముగ ప్రకటింపబడినది.

ఆ వ్యాసమును చదివి ప్రశంసించిన పెక్కురు దాని నొక పుస్తకరూపకముగ ప్రకటింపవలసినదని కోరిరి.

నేను హైదరాబాదులోని శ్రీ శృంగేరీవారి శంకర మఠమునకు 1961 సంవత్సరపు చాతుర్మాస్యదీక్షా నిర్వాహణార్థమై వెళ్ళినపుడు హైదరాబాదు; సికిందరాబాదు జంట నగరములలో ప్రఖ్యాత ముద్రాపకు [Printers] లయిన అజంతా ముద్రణాలయాధిపతులగు శ్రీమాన్ ఎన్. సి. వేంకటాచార్యులుగారితో ఈ వ్యాసమును పుస్తకరూపకముగ ప్రకటించు విషయమై ప్రస్తావించితిని. వారు తమ సహజ ఔదార్యముతో ఈ పుస్తకమును ఉచితముగ అచ్చువేయించెదమని వెంటనే తమ అభిప్రాయమును ప్రకటించిరి.

శ్రీమాన్ వేంకటాచార్యులుగారు సంస్కృతాంధ్రములందును వ్యాకరణ శాస్త్రమునందును చక్కని పాండి

త్యమును, కవితా నైపుణ్యమును గలిగి అనేక అష్టావధాన శతావధానములను సలిపి ఉద్గ్రంధముల రచించి దిగంత విశ్రాంత యశశ్చంద్రికా విరాజమానులైన విద్వత్కవి శేఖరులయి యున్నారు. బంగారమునకు పరిమళ మబ్బినట్లు వారి పాండిత్యగరిమకు వన్నె తెచ్చినది వారి సహజ ఔదార్యాది గుణగణము. వారి కనేక అత్యావశ్యక కార్యాంతరములున్నను ఈ నా వ్యాసమును పుస్తకరూపముగ అచ్చు వేయించి నా కందించినారు.

ఈ పుస్తక ముద్రణమునకు కావలసిన కాగితమును సికిందరాబాదులో వస్త్ర వ్యాపాంస్థులును, సీతారామనామ సంకీర్తన సంఘ సంస్థాపకులును, సనాతన ధర్మాచరణ నిష్ఠా గరిష్ఠులును, ఆస్తికోత్తములును, ఉదారచరితులును అగు శ్రీ జూలూరి జగదీశ్వరయ్య శ్రేష్ఠిగారు ఉచితముగ నొసంగి ఈ పుస్తక ప్రకటనమునకు తోడ్పడిరి.

ఈ పుస్తకమును శ్రమ అనుకొనక అవలోకించి నా యందు వాత్సల్యముతో ఆశీఃపూర్వక శ్రీ ముఖములను అనుగ్రహించిన మా గురువర్యులగు శ్రీ శ్రీ శ్రీ శృంగేరీ పీఠ జగద్గురువులకును శ్రీ శ్రీ శ్రీ కామకోటిపీఠజగద్గురువులకును నా నమస్కృతంబులు.

సికిందరాబాదులో హిందుస్థానీ డైరీ పబ్లిషర్సుగా ప్రఖ్యాతులైన శ్రీ చిట్టా వేంకటరామశాస్త్రిగారు తమ హజోత్సాహముతోను, ప్రావీణ్యముతోను ఔదార్యము

తోను ప్రథమము నుండియు ఈ పుస్తక ప్రచురణాదికమునకు తోడ్పడిరి.

ఇట్లు ఈ పుస్తక ముద్రణమునకు తోడ్పడిన శ్రీమాన్ వేంకటాచార్యులగారికిని, శ్రీ జూలూరి జగదీశ్వరయ్య శ్రీ చిట్టా వేంకట రామశాస్త్రిగార్లకును సకలశ్రేయస్సులు కలుగుగాక యని మానారాయణస్మరణ పూర్వక ఆశీస్సులు

ఈ గ్రంథమునుచూచి ప్రశంసను రచించిన "ఆమ్నాయార్థ వాచస్పతి" "వేదబాష్యవిశారద' 'వేదభాష్యాలంకార" బ్రహ్మశ్రీ ఉప్పులూరి గణపతిశాస్త్రిగారికి సకల శ్రేయస్సులు కలుగుగాక యని మా నారాయణస్మరణ పూర్వక ఆశీస్సులు.

శ్రీగాయత్రీ పీఠము
శంకరమఠము
మచిలీపత్తనము
కృష్ణామండలము

విద్యాశంకర భారతీస్వామి

# ద్వితీయ ముద్రణకు పీఠిక

జగజ్జీవేశ్వర తత్త్వము-అద్వైతము అను పుస్తకమును రచించి సికిందరాబాదులోని అజంతా ప్రింటర్సువారి చేత ప్రథమముద్రణ 1000 ప్రతులు అచ్చువేయించి 1963 సం॥ములో ప్రకటించడమైనది.

ఆ ప్రతులన్నియు అయిపోవుటచేతను ఆ గ్రంథమును కావలెనని కోరు వారు చాలామంది ఉండుటచేతను ద్వితీయ ముద్రణము 1000 ప్రతులు వేయించ నవసరము కలిగినది.

ఈ ప్లవంగ సంవత్సర చాతుర్మాస్యదీక్షా నిర్వహణ మునకై నేను హేలాపురిఅను ఈ ఏలూరు పట్టణమునకు వచ్చి శంకరమఠములో గీతోపన్యాసముల ద్వారా ధర్మ భక్తిజ్ఞాన ప్రబోధమును గావించుచుండగా ఈ పట్టణ ప్రము ఖులలో నొకరగు శ్రీ ఈదర పట్టాభిశ్రీరామ (వెంకయ్యగారి పుత్రరత్నము) గారు ఈగ్రంథముయొక్క ద్వితీయముద్రణా వశ్యకతను గురించి విని ఈ యేలూరు పట్టణములో నిది వరకెన్నడు సామాన్య యతీశ్వరులుకాని, పీఠాధిపతులైన యతీశ్వరులుకాని వ్యాసపూజను చాతుర్మాస్య దీక్షను నిర్వ హించక పోవుటచేతను ఈ సంవత్సరము నేనువ్యాసపూజను గావించి చాతుర్మాస్యదీక్షను నిర్వహించుటచేతను, ఇట్టి

అపూర్వ సన్నివేశమునకు చిహ్నముగా నా యీ గ్రంథమును ఉచితముగ తమ పట్టాభిరామముద్రణాలయములో అచ్చు వేయించెదనని తమ సహజ ఔదార్యముతో చెప్పి తమకు ఇతర వత్తిడి పనులెన్నియున్నను, దీనిని అతి శీఘ్రకాలములో అచ్చువేయించి యిచ్చినారు.

శ్రీ ఈదర పట్టాభి శ్రీరామగారికిన్ని, వారి కుటుంబమునకున్ను ఆయురారోగ్య ఐశ్వర్యములతో సకలశ్రేయోభివృద్ధి అగుగాక అని నారాయణ స్మరణ పూర్వక ఆశీస్సులు.

మకాం:

శంకరమతము విద్యాశంకర భారతీస్వామి

ఏలూరు

ప్లవంగ గాయత్రీ పీఠాధిపతి

కృష్ణాష్టమి

# జగజ్జీవేశ్వరుల తత్త్వము : అద్వైతము



ఆస్తికుడైన ప్రతిమానవుడు జీవుడగు తానొకడున్నా డనిన్నీ, తన కెదురుగా కనబడు జగత్తు ఉన్నదనిన్నీ, సృష్టికర్తయగు ఈశ్వరుడు ఉన్నాడనిన్నీ విశ్వసించును. ఈ మూడింటికిగల పరస్పర సంబంధమును గురించి వేర్వేరు విధముల సిద్ధాంతీకరింపుచూ వివిధమతములు బయలు వెడలినవి. ఈ మతము లన్నిటిని ద్వైతము, విశిష్టాద్వైతము అద్వైతము అను మూడు విధములుగ విభజింపవచ్చును.

## ద్వైతము

జగత్తు సత్యమనియు, జీవుడు ఈశ్వరుడు భిన్నులనియు, ఒక జీవునికిని ఇంకొక జీవునికిని భేదము గలదనియు, ఈశ్వరునికిని జగత్తునకును భేదము గలదనియు, జగత్తులోనొక వస్తువునకును ఇంకొక వస్తువునకును భేదము కలదని జీవునికిని జగత్తునకు భేదము కలదనిన్ని ఇట్లు ప్రత్యక్షముగా ప్రతి మానవునికిని గోచరించు అయిదు భేదములు చెప్పునది ద్వైతమతము. జీవులు భక్తిచేత భగవంతుని లోకమును సామీప్యమునచేరి అచ్చట భగవత్సేవచేయుచు ముక్తులుగ నుందురని ద్వైతుల సిద్ధాంతము. ప్రపంచములోని క్రీస్తు మతము, మహమ్మదీయ మతము మున్నగు మతములన్నియు ఈ ద్వైత సిద్ధాంతము క్రిందికి వచ్చును. మన దేశములో మధ్వాచార్యులచే స్థాపింపబడినది ఈద్వైతమతమే.

## విశిష్టాద్వైతము

శ్రీరామానుజాచార్యులవారిచే స్థాపింపబడినది విశిష్టా ద్వైతము. ఈమతము ప్రకారము జగత్తున్ను జీవులున్ను భగవంతునకు శరీరస్థానములో నుండునవియు, జీవేశ్వరులకు గల సంబంధము అంశాంశి సంబంధము లేక అవయవ అవయవి సంబంధము అనియు, భక్తిచేత జీవులు భగవంతుని చేరి సారూప్యస్థితిలో నుండి ముక్తులగుదు రనియు వారి సిద్ధాంతము. నానావిధ పత్రపుష్ప ఫలాదులతో నొప్పారుచున్నను వృక్షము మాత్రము ఒక్కటే యని చెప్పబడుచున్నట్లు నానావిధ జీవులతోను సత్యమైన జగత్తుతోను విశిష్టుడయి యున్న ఆ భగవంతుడు ఒక్కడుగానే యున్నాడు అనుట చేత వీరి సిద్ధాంతమునకు విశిష్ట అద్వైతమని పేరువచ్చినది.

## అద్వైతము

అద్వైత మనునది పై చెప్పినవాని కన్నింటికి విలక్షణమై విరాజిల్లుచున్నది. భగవంతుడు లేక బ్రహ్మ యనునది ఒక్కటిమాత్రమే సత్యమై అనంతమై జ్ఞానానంద స్వరూప మైనవనిన్ని, జగత్తు మిథ్య అనిన్ని జీవుడు తాత్వికముగ బ్రహ్మమే అనిన్ని వీరి సిద్ధాంతము. ఇదియే శ్లోకార్థములో 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః' అని వక్కాణించబడినది. జగజ్జీవ బ్రహ్మలకు గల పరస్పర సంబంధము ద్వైతాద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతములలో నే సిద్ధాంతానుసారముగ శ్రుతియుక్తి అనుభూతులవల్ల నిర్ణయింప వీలగునో పరిశీలింతము. శ్రుతి ( అనగా గ్రంథ ) ప్రమాణము ననుసరించియు, యుక్తి నిబట్టియు, అనుభవమును

బట్టియు తేలిన సిద్ధాంతమే సరియైన సిద్ధాంత మగును కాని అసత్యముకానేరదుగదా. గ్రంథప్రమాణము అనగా సంస్కృత వాఙ్మయములో వేదములు, పురాణములు, ఇతిహాసములు, సూత్రములు మున్నగునవిన్ని, యితరభాషలలో బైబిలు, ఖురాను మున్నగునవన్ని, అయ్యున్నవి. యుక్తి అనగా సామాన్యముగ తర్కపరిశీలనమే కాక పాశ్చాత్య విజ్ఞానములో 'Soience' అను పేరిట విరాజిల్లుచున్న విజ్ఞానపరిశోధనయును చేరును. అనుభవము అనగా గ్రంథస్థములయిన మహాపురుషుల అనుభవమున్ను, ప్రాచ్యపాశ్చాత్య మహాపురుషుల అనుభవమున్ను మున్నగునవి చేరును. ముందు సంస్కృత వాఙ్మయమును పరిశీలింతము.

## సంస్కృతవాఙ్మయము:౧ - వేదములు

వేదములు అనంతములు. వానిలో ముఖ్యమయిన భాగమును వేదవ్యాసభగవానుడు ఋక్, యజు, స్సామ, అథర్వణము లను విధముగా నాలుగు భాగములుగా విభజించి మహోపకారము గావించెను. అట్లు విభజించుటచేతనే 'వ్యాసః' అను పేరు వచ్చినది. (వ్యాసః = విభజనకర్త) వేదములు ఎవరిచేత రచింపబడినవి కాకపోవుటేకాక, ఆ పరమేశ్వరుని ఉచ్ఛ్వాస నిశ్వాసరూపములు అనిన్ని, అవి నిత్యమైన వనిన్ని, ఉచ్ఛ్వాస నిశ్వాసములకు ఎవరును యెట్లు కర్తలుకారో అట్లే పరమేశ్వరుడును ఆ వేదములకు కర్త కాడనిన్ని, పరమేశ్వరునివల్ల ఆ వేదములు అభివ్యక్తమైన వనిన్ని, అందుచేత అవి అపౌరుషేయములు నిత్యములు అనాదులనిన్ని, ఆ పరమేశ్వరుని యొద్దనుంచి చతుర్ముఖ

బ్రహ్మ వినుటచేతను, వానియొద్దనుంచి మహర్షులు వినుటచేతను వానికి శ్రుతులు అనే పేరు వచ్చినదనిన్ని, మహర్షులయొద్దనుంచి అవిచ్ఛిన్న గురుపరంపరగా నేటికిని అవి మన భారతదేశములో విరాజిల్లుచున్న వనిన్ని, అవి పరమ ప్రామాణములనిన్ని మానవులకు ప్రత్యక్షప్రమాణము చేతగాని అనుమాన ప్రమాణముచేతగాని తెలిసికొనుటకు సాధ్యముకాని విషయములను వేదము తెలియచేయును కనుక దానికి 'వేదము' (వేదయతీతి వేదః) అను పేరు వచ్చినదనిన్ని వేదములోని అంతరంగిక సాక్ష్యమునుబట్టిన్ని, వేదేతర ప్రాచీన గ్రంథములగు స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, కావ్యములు మున్నగు సంస్కృత వాఙ్మయమంతటిలోని సాక్ష్యమునుబట్టిన్ని, స్పష్టమగుచున్నది. ఇట్టి ప్రబల సాక్ష్యమునకు భిన్నముగా క్రీ. పూ. 3000 లో వేదములు రచింపబడియుండవచ్చునను పాశ్చాత్యుల ఊహాగానమును అంగీకరించుట బుద్ధిమంతుల లక్షణము కానేరదు గదా. అట్టి వేదములయొక్క సారము ఉపనిషత్తులలో గాననగును. ఆ యుపనిషత్తుల సారమే భగవద్గీతలోను, బ్రహ్మసూత్రములలోను, విరాజిల్లుచున్నది. అందుచేతనే మన వేదమతమునకు లేక హిందూమతమునకు ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రములు అనునవి మూడు ప్రస్థానములుగా ప్రఖ్యాతిని గాంచినవి. ఆ మూడింటిలోను జగజ్జీవేశ్వరుల తత్త్వము ఎట్లువర్ణింపబడినదో పరిశీలించుట మన ముఖ్య కర్తవ్యమై యున్నది. ఆ మూడిటిలోను భగవద్గీత ఎక్కువ ప్రఖ్యాతిని గాంచియుండుటచేత, మున్ముందుగా భగవద్గీతను పరిశీలించి

చూచుదము.

# భగవద్గీత

భగవద్గీతయొక్క సందేశ మేమి? కర్మానుష్ఠానమా? భక్తి ప్రబోధమా? జ్ఞానప్రబోధమా? జ్ఞానమే అయినచో ద్వైతజ్ఞానమా, విశిష్టాద్వైతజ్ఞానమా, లేక అద్వైతజ్ఞానమా అను రెండు విషయములు విచారణీయములు అయ్యున్నవి.

అర్జునుడు యుద్ధము చేయుటకై యుద్ధభూమిలోనికి వచ్చి గురువులను, బంధువులను చూచి వీరందరు యుద్ధము జరిగినచో మరణింతురే యను జాలి, విషాదము కలిగి యుద్ధము చేయననిన్ని, ఇట్టి ఘోరయుద్ధము చేయుటకంటె భిక్షాటనము చేయుట మంచిదనిన్ని, నిశ్చయించుకొనగా, శ్రీకృష్ణుడు అతనికి గీతను బోధించెను. అంతట విషాదముపోయి అర్జునుడు యుద్ధముచేసెను.

ఇప్పుడు మనము విచారింపవలసినది అర్జునునికి విషాద కారణమేమి, దానికి శ్రీకృష్ణుడు చేసిన చికిత్స యేమి అను విషయము. రోగనిదానము సరిగా తెలిసినగాని సరియైన చికిత్సచేయుట సాధ్యము కానేరదు. అర్జునునికి విషాదకారణము యుద్ధములో అందరూ చనిపోవుదురనియేకదా. అనగా దేహములు నశించిన ఆత్మలుకూడా నశించును అను భావముమీదనే ఇట్టి విషాదము కలుగును. కనుక విషాదకారణము దేహాత్మ భ్రాంతియని తేలినది. ఇది మొదటిది. ఈ భ్రాంతిని అనుసరించి స్వధర్మమైన యుద్ధమునుమాని పరధర్మమైన భిక్షాటనము చేయుటకు సంసిద్ధుడైనాడు. ఇది

రెండవ దోషము ఈ రెండు దోషములకు శ్రీకృష్ణుడు రెండు చికిత్సలను చేసినాడు. మొదటి దోషనివారణకు దేహమువేరు, ఆత్మవేరు అనిన్ని, దేహము అనిత్యము ఆత్మ నిత్యము అనిన్ని గీత 2 వ అధ్యాయములో 11 వ శ్లోకము మొదలు 39 వ శ్లోకమువరకుచెప్పి ఆపైని విస్తారముగా స్వధర్మానుష్ఠానమే ఇట్టి జ్ఞానోదయమునకు సాధనమని బోధించెను. మిగతా అధ్యాయములలోను నీభావములే విశదీకరింపబడినవి. రెండవదోషమునకు చికిత్స ప్రతిఫలాపేక్ష లేకుండా స్వధర్మమును ఆచరించుట అను కర్మయోగము. మొదటి దోషమునకు ఆత్మనిత్యత్వమును, దేహాదుల అనిత్యత్వమును బోధించు జ్ఞానయోగము. ఈరెండే ప్రధానముగ గీతలో బోధింపబడినవి. వీనిలో జ్ఞానయోగము ప్రధానము, దీనికికర్మయోగము సాధనము. గీత 3 వ అధ్యాయము 3 వ శ్లోకము ' లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురాప్రోక్తా మయానఘ । జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం ' అనునది ఈ విషయమును స్పష్టము చేయుచున్నది. గీతలోచెప్పబడిన భక్తి, ప్రపత్తి, వైరాగ్యము, సన్యాసము, యోగము అనునవి అన్నియు ఈరెంటిలో నంతర్భూతములే అయి యున్నవి. కర్మజ్ఞానములలో కర్మానుష్ఠానమే గీతయొక్క ప్రధాన సందేశమనిన్ని, జ్ఞానము కాదనిన్ని కొందరు అభిప్రాయ పడినారు. కాని ఆభావము సరియైనది కాదని గీతలోని శ్లోకములవల్లనే స్పష్టపడగలదు. అదెట్లనగా 4 వ అధ్యాయము 33 వ శ్లోకములో ' సర్వంకర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే " కర్మానుష్ఠాన ఫలితము జ్ఞానోదయ

మగుటయే అని శ్రీకృష్ణుడు అర్జునునికి బోధించెను. కర్మ వాదులు తమ వాదమునకు అనుకూలముగా చెప్పునదే మనగా, యుద్ధకర్మను చేయుటకు వచ్చిన అర్జునుడు యుద్ధము చేయుననగా శ్రీకృష్ణుడు గీతను బోధించి అతనిచేత ఆయుద్ధ కర్మనే చేయించినాడు కనుక గీతా సందేశము కర్మానుష్ఠానమే యని వారు చెప్పుదురు, ఈవాదముపైకి చాలా యుక్తముగానే ఉన్నట్లు గోచరించును కాని లోతుగా విమర్శించినచో ఈ వాదము నిలువనేరదు. ఎట్లనగా - ఇంట్లో కూర్చొనియున్న అర్జునుని శ్రీకృష్ణుడు యుద్ధము చేయుము అని బోధించి యుద్ధభూమికి తీసుకొనిరాలేదు. యుద్ధము చేయుటకు తానే నిశ్చయించుకొని శ్రీకృష్ణుని సారధిగా రమ్మని ప్రార్థించి తెచ్చుకొని యుద్ధభూమికి వచ్చినాడు. అందరిని చూడగానే దేహములు నశించినచో ఆత్మలు కూడా నశించును అను అజ్ఞానమోహము ఆతనిని ఆవరించినది. అంతట యుద్ధము చేయను అని ఆగిపోయినాడు. ఇప్పుడు శ్రీకృష్ణుడు గీతాబోధవల్ల ఆ మబ్బుగావచ్చిన అజ్ఞాన మోహమును పోగొట్టినాడు. ఆ మోహము పోగానే యుద్ధము చేయుటకే సిద్ధపడి వచ్చిన అర్జునుడు యుద్ధము తనంతట తనే చేసినాడు. కనుక గీతాబోధయొక్క ఫలితమేమనగా, అర్జునునికి ఆవరించిన మోహమును పోగొట్టుటే.

నీటిప్రవాహములో ఒకరాయి అడ్డు పడినప్పుడు నీటి ప్రవాహము ఆగిపోవును. అప్పుడు మనము చేయునది ఆ అడ్డు పడిన రాతిని తీసివేయుటే గాని, నీటిని ప్రవహించునట్లు చేయుట కాదుకదా. ఆ అడ్డును తొలగించగనే నీరు దానం

తట అది సహజముగ ప్రవహించును. అటులనే అర్జునునికి గీతాబోధవల్ల అజ్ఞానమనే అడ్డుపోగానే తనంతట తాను యుద్ధము చేసెను. కనుక కర్మవాదుల వాదము నిస్సారము. గీతా శ్లోకములవల్లనే పై విషయము స్పష్టము కాగలదు. అర్జునుడు విషాదాంతమున 2 వ అధ్యాయము 7 వ శ్లోకములో "కార్పణ్య దోషోపహత స్వభావః పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః। యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మేశిష్యస్తేఽహం శాధి మాంత్వాం ప్రపన్నం" అని శ్రీకృష్ణుని ప్రార్థించుటలో తనకు అజ్ఞానము ఆవరించుట చేత ధర్మమేదియో తెలియక మూఢత్వము ( మోహము యొక్క కార్యము ) కలిగినదనిన్ని, అదిపోవునట్లు శాసించి బోధింపుమనిన్ని కోరినాడు. కనుక ప్రప్రథమముననే అర్జునుడు తనకు మోహము ఆవరించినదని చెప్పుకొన్నాడు. గీతాబోధవిన్న తరువాత, చివరకు, " నష్టోమోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత " (18 వ అధ్యాయము 73 వ శ్లోకము)అనగా శ్రీకృష్ణునిబోధవల్ల తనకు మోహము పోయినదనిన్ని ఆత్మజ్ఞానము కలిగినదనిన్ని, స్పష్టము చేసినాడు. అజ్ఞాన మోహమును పోగొట్టునది జ్ఞానబోధయే కాని ఇంకొకటి కామగదా. కనుక అర్జునుని నోటిమీదుగానే గీతా సందేశము కర్మకాదనిన్ని అజ్ఞాన మోహమును పోగొట్టి ఆత్మస్మృతిని కలుగజేయు జ్ఞానబోధయే అనియు స్పష్టమగుచున్నది. ఇంతియేకాదు. శ్రీకృష్ణుడుకూడ తాను చేసిన బోధ జ్ఞానమే యని స్వయముగా 18 వ అధ్యాయము 63 వ శ్లోకములో 'ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాత్ గుహ్య

తరం మయా । విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు" అనగా తాను గుహ్యాతి గుహ్యమైన జ్ఞానమును ఉపదేశించినా డనిన్ని, దానిని విమర్శించి అర్జునుడు తనకు ఇష్టమువచ్చినట్లు ప్రవర్తింప వచ్చుననిన్ని స్పష్టీకరించినాడు. ఈ చివరిబోధలో కూడ 'నీ యిష్టము వచ్చినట్లు' అనగా యుద్ధముచేయుటో లేక భిక్షాటనముచేయుటో, ఈబోధవిన్న తరువాత నీకు ఏది యుక్తమని తోస్తే దానిని ఆచరింపుము" అని చెప్పినాడే కాని యుద్ధమేచేయుము అని ఆదేశించలేదు. అంతట అర్జునుడును తనంతట తానే యుద్ధము చేసినాడు. గీతలో మధ్య మధ్య "యుధ్యస్వ" (యుద్ధము చేయుము) అని కృష్ణపరమాత్మ బోధించినను ఆ బోధ అనువాదమే కాని విధి కాదు. ఒకడు ఒక త్రోవలో పోవుచుండగా కొంతదూరము వెళ్ళినతరువాత రెండు మార్గములు కనపడగా ఏమార్గమున పోవలెనో సందేహముకలిగి 'ఏత్రోవను పోవలెను?' అని అక్కడ ఉన్నవారిని అడుగగా ఈత్రోవను పొమ్ము" అని వారు జవాబు చెప్పినారు. "ఈత్రోవను పొమ్ము" అను వాక్యము సందేహమును నివారణ చేసినదే కాని పోవుటను విధిగా బోధించలేదు, అది అనువాద మాత్రమే. పరధర్మమైన భిక్షాటనము తప్పు అనిన్ని స్వధర్మమైన యుద్ధమే శ్రేయస్కరమనియు శ్రీకృష్ణుని జ్ఞానబోధవల్ల అర్జునుడు నిశ్చయించుకొని యుద్ధము చేసినాడు. ఇంకను 18 వ అధ్యాయం 72 వ శ్లోకములో "కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ" అని శ్రీకృష్ణుడు అర్జునుని 'నీకు అజ్ఞానమువల్ల కలిగిన మోహముపోయినదా' అని అడుగగా

అర్జునుడు ' నష్టో మోహః స్మృతిర్లబ్ధా నా మోహము పోయినది. ఆత్మజ్ఞానము కలిగినది' అని జవాబు ఇచ్చినాడు. కనుక అర్జునుని మాటలవల్లను కృష్ణుని మాటలవల్లను కూడా గీతాసందేశము జ్ఞానబోధయేకాని కర్మబోధకాదు అని తేలు చున్నది.

భక్తివాదులు ( ద్వైతులు విశిష్టాద్వైతులు ) గీతాసందేశము భక్తిప్రబోధమేకాని జ్ఞానముకాదు అని వాదింతురు. దీనినికూడ విమర్శించుదము. భక్తికిని జ్ఞానమునకును సంబంధమును తెలియజేయు శ్లోకములలో ముఖ్యమైనవి రెండు కలవు. అందు మొదటిది 10 వ అధ్యాయములో 10 వ శ్లోకము. అంతకు పూర్వపు శ్లోకములో భక్తులు ఎట్లు ప్రవర్తించెదరో వర్ణించి

"తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే"

అను 10 వ శ్లోకములో అట్టి ప్రీతిపూర్వకముగ ఎల్లపుడు నన్ను భక్తిచేత సేవించువారికి నేను జ్ఞానయోగమును ప్రసాదించుచున్నాను. అట్టి జ్ఞానయోగమువల్ల వారు నన్ను పొందుదురు, అని శ్రీకృష్ణుడు చెప్పుటవల్ల భక్తియొక్క ఫలము జ్ఞానోదయమేకాని సాక్షాత్తు మోక్షము కాదనియు, జ్ఞానముచేతనే భగవత్ప్రాప్తి అనుమోక్షము లభించుననియు స్పష్టపడుచున్నది. ఇటులనే 18 వ అధ్యాయము 55 వ శ్లోకములో "భక్త్యామా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః " " భక్తివల్ల నా స్వరూపమును ప్రభావమును తాత్త్వికంగా తెలిసికొందురు ' అని చెప్పుటవల్లకూడా జ్ఞాన

మునకు భక్తి సాధనమని తెలుచున్నది.

పైన చెప్పినదానిని బట్టి కర్మయును, భక్తియును జ్ఞానమునకు సాధనములనియు, గీతా సందేశము జ్ఞానమే యనియు జ్ఞానమువల్లనే మోక్షప్రాప్తియనియు స్పష్టమగు చున్నది. గీతను గురించి విచారణీయమైన రెండు విషయము లలో మొదటిది తెలినది. ఇకను రెండవది. గీతలో చెప్ప బడిన జ్ఞానము ద్వైతజ్ఞానమా, విశిష్టాద్వైతజ్ఞానమా, లేక అద్వైతజ్ఞానమా అనునది తేలవలసి యున్నది.

గీతలోని 18 అధ్యాయములును కర్మషట్కము, భక్తిషట్కము, జ్ఞానషట్కము అని మూడు షట్కములుగా నొక విభాగముకలదు. మొదటి ఆరు అధ్యాయములును కర్మయోగమును గురించియు, 2 వ ఆరు అధ్యాయములు అనగా 7 వ అధ్యాయము మొదలు 12 వ అధ్యాయము ఆఖరువరకు భక్తి యోగమును గురించియు, చివర ఆరు అధ్యాయములు అనగా 13 వ అధ్యాయము మొ॥లు 18 వ అధ్యాయము ఆఖరువరకు జ్ఞానమునుగురించియు బోధించును. ఇంకొక విభాగము ప్రకారం మొదటి షట్కము జీవుని స్వరూపమును, రెండవ షట్కము ఈశ్వరుని స్వరూపమును, మూడవ షట్కము జీవేశ్వరుల సంబంధమును బోధించును. ఈరెండు రకముల విభాగములకును అన్యోన్య సంబంధము కలదు. మొదటిషట్కములోని జీవుడు ఆషట్కములో చెప్ప బడిన నిష్కామకర్మానుష్ఠానము వలన చిత్తశుద్ధికలవాడై సంస్కృతు డగును. అంతట అట్టి సంస్కృత జీవుడు రెండవ షట్కములోని ఈశ్వరుని ఆషట్కములో చెప్పబడిన భక్తి

చేతసేవించి ఈశ్వరానుగ్రహమునకు పాత్రుడగును. అంతట అలేడు 13 వ షట్కములో చెప్పబడిన జ్ఞానయోగము చేత 'క్షేత్రజ్ఞంచాపి మాంవిద్ధి" అను శ్లోకం ప్రకారము అట్టి సంస్కృతజీవుడు బ్రహ్మయే కాని భిన్నుడు కాడు అను సర్వాత్మభావమును జీవబ్రహ్మైక్యమును సాక్షాత్కరించుకొని ముక్తుడగును. ఇట్టి జీవబ్రహ్మల కభేదమును బోధించు జ్ఞానము అద్వైతమేకదా.

ఇక గీతలో బోధింపబడిన జ్ఞానముయొక్క స్వరూప స్వభావములను తెలిసికొనుటకై గీతలోని శ్లోకములనే విమర్శించి పరిశీలించుదము. అర్జునునికి శ్రీకృష్ణుని బోధ 2 వ అధ్యాయములో 11 వ శ్లోకమునుంచి ప్రారంభము. 'నత్వేవాహం జాతు నాసం...' 'నజాయతే మ్రియతేవా... నైనం ఛిందంతి శస్త్రాణి...' "దేహీనిత్యమవధ్యోయం... వేదాఽవినాశినం నిత్యం..." ఈ మొదలగు శ్లోకములలో జీవుడునిజముగా జన్మమరణములు లేని నిత్యుడు అనిబోధింపబడినవి. అట్టి నిత్యమైన జీవుడు ఆయా ఉపాధులనుబట్టి అనేకులుగా కనుపడుచున్నాడే కాని వాస్తవములో ఒక్కడే. "అంతవంత ఇమే దేహాః నిత్యస్యోక్తా శ్శరీరిణః...' "దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య...' మున్నగుశ్లోకములలో దేహీ అయిన జీవుడు నిత్యుడనిన్ని" అట్టి నిత్యుడయి ఒక్కడైన జీవునికే యీ నానావిధములగు దేహములున్నవనిన్ని అట్టి దేహములన్నియు అనిత్యములని చెప్పబడినవి. ఇట్లు ఈశ్లోకములలో జీవునియొక్క నిత్యత్వమును ఏకత్వమును ప్రతిపాదించి 7 నుంచి 12 అధ్యాయములలో ఈశ్వరుని

ఏకత్వమును నిత్యత్వమును ప్రతిపాదించి 18 వ అధ్యాయ ము లో గీత ఆ యిద్దరికి అభేదమును లేక ఐక్యమును బోధించినది. ఇంకను 2వ అధ్యాయము 11వ శ్లోకము మొదలు 39వ శ్లోకమువరకు జీవునియొక్క ఏకత్వ నిత్యత్వములను గీత బోధించి, 39వశ్లోకములో " ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిః...' అని శ్రీకృష్ణుడు అర్జునునికి సాంఖ్యోపదేశమును అనగా ఆత్మజ్ఞానోపదేశమును పూర్తి చేసినాడు. 'సాంఖ్యం అనగా సమ్యక్ ఖ్యాయతే అనేన ఆత్మతత్త్వం ' ఆత్మజ్ఞానమని యర్థము. ఇట్లు ఈశ్వరుని సంగతి ఏమియు బోధింపకుండగనే 2 వ అధ్యాయములో శ్రీకృష్ణుడు జ్ఞానోపదేశ ఉపన్యాసమును ముగించి నీకు చెప్పవలసినదంతయు చెప్పినాను అనుటలో శ్రీకృష్ణుని భావమేమి ? జీవతత్త్వము ఏకము. నిత్యము అని తెలిసికొన్నంత మాత్రమున మోక్షము లభించునా ? ఈశ్వరతత్త్వమునుకూడ తెలిసికొని రెంటికిని అభేదమును దర్శించినప్పుడేకదా మోక్షము ! దీనిలోని రహస్యమేమన - ఉపనిషత్తులలో బ్రహ్మజ్ఞానమువల్ల మోక్షము వచ్చును అని చెప్పబడినది. ఆ బ్రహ్మ ఎట్టివాడనగా "ఏకమేవాద్వితీయం " అని 'నిత్యం' అని మున్నగు విధములుగా వర్ణింపబడినది. ఇప్పుడు బ్రహ్మ యొక్క తత్త్వము ఏకత్వము, నిత్యత్వము కలది అనిన్ని తేలినది. ఇట్లు ఏకమై నిత్యమై అనంతమైన వస్తువులు రెండుఉండనేరవుకదా. రెండు ఉండగానే, దేనికిని ఏకత్వము సిద్ధించదుగదా. ఇంకను రెండు వస్తువులు ఉన్నచో రెండును పరిచ్ఛిన్నములు అగును కనుక రెండును నశ్వరములై అనిత్యములగును కాని నిత్యములు

కానేరవు. కనుక ఏకత్వ నిత్యత్వ లక్షణములుగల వస్తువు ఒక్కటే ఉండవలెను. ఈ లక్షణములు జీవునకిన్ని చెప్పుట చేతను బ్రహ్మకు ఇట్టి లక్షణములు ఉన్నవని యందరకును తెలిసిన విషయమే కనుకను, ఈవిధముగా జీవ బ్రహ్మలకు ఐక్యమును లేక అభేదమును చెప్పకుండానే చెప్పినట్లు అయినది. ఇంకను 'యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి...' 'సర్వభూతస్థమాత్మానం..." 'యోమాంపశ్యతి సర్వత్ర..." జ్ఞానీత్వాత్మైవ " మున్నగు శ్లోకములుకూడా జీవబ్రహ్మల కభేదమును బోధించుచున్నవి. ఈ విధముగా కూడా గీతలోని జ్ఞానబోధ అద్వైతమే అని స్పష్టమగుచున్నది. కనుక జీవేశ్వరుల సంబంధము పైనచెప్పినచొప్పున అద్వైత మని తేలినది.

**జగత్తు మిథ్య**

ఇకను జగత్తుయొక్క స్వరూపము సత్యమా, లేక మిథ్యయా అనునది తేలవలసియున్నది. ఈ విషయమై గీత ఏమి బోధించుచున్నదో పరిశీలింతము. పైన చెప్పిన ప్రకారము 2 వ అధ్యాయములో గీత ఆత్మయొక్క ఏకత్వమును నిత్యత్వమును నిరూపించి అట్టి ఆత్మను "సత్" అని వర్ణించినది. ఇకను దేహాదులతో కూడియున్న జగత్తును "మాత్రాస్పర్శాస్తు కౌంతేయ ! శీతోష్ణ సుఖదుఃఖదాః ఆగమాపాయినోఽనిత్యాః తాంస్తితిక్షస్వ భారత ॥ "అంతవంత ఇమే దేహాః" మున్నగుశ్లోకములలో అనిత్యముగ వర్ణించి దీనిని "అసత్" అని అన్నది. ఇట్టి "సత్,అసత్" లకు అన్యోన్య సంబంధము 16 వ శ్లోకము "నాఽసతో విద్యతే భావః

నాఽభావో విద్యతే సతః । ఉభయోరపిదృష్టోఽన్త స్త్వ
నయోః తత్త్వదర్శిభిః' లో నిర్ణయింపబడినది. ఆ నిర్ణయ
మేమనగా -'సత్' కు అభావములేదు. అసత్తుకు భావము
లేదు. అసత్తుకు భావములేదు అనగా సత్ ఎప్పుడు సత్తే
అసత్ ఎప్పుడు అసత్తే. అనగా ఉన్నవస్తువుఎప్పుడూ ఉంటుంది.
లేనివస్తువు ఎప్పుడూ లేనేలేదు. అనగా ఉన్న వస్తువుకు
లేమిలేదు; లేనివస్తువునకు ఎప్పుడూ ఉనికిలేదు. 'సత్' అంటే
ఆత్మ 'అసత్' అంటే జగత్. కనుక ఆశ్లోకభావ మేమనగా
ఆత్మకు ఎప్పుడును నాశనములేదు; జగత్తుకుఎప్పుడూ ఉనికిలేదు,
యని తేలినది. ఇక్కడ ఒక సంశయము కలుగవచ్చును. ఉన్న
వస్తువు ఎప్పుడూ ఉంటుంది. లేనివస్తువు ఎప్పుడూ ఉండదు
అని అందరికిని తెలిసిన విషయమును శ్రీకృష్ణుడంతటివాడు
అర్జునునికి బోధించవలెనా? యట్లుబోధించుటలో భావమేమి?
నిషేధము ఎప్పుడును ప్రసక్తమైన దానికే చేయవలెను కాని
అప్రసక్త ప్రతిషేధము కూడదు గదా! ఇప్పుడు శ్రీకృష్ణుడు
ఆశ్లోకములో ఆత్మకు అభావములేదనియు, జగత్తుకు భావము
లేదనియు నిషేధించుటలో యట్లునిషేధించవలసినయవసరమేమి
కలిగినదను ప్రశ్న పుట్టును. ఉదాహరణకు, ఎవరైన మన
యింట్లోకి రాదలిచినట్లు కనబడితే, ఆతనిని రానిచ్చుట యిష్టము
లేనిచో రావద్దని నిషేధింతుము. అంతేకాని అతను త్రోవ
వెంట వెళ్ళుచూ మన యింటి లోకి వచ్చే సూచనలే కనపడ
నప్పుడు ఆతనినిరావద్దని నిషేధించముకదా. యట్లేఆత్మజగ
త్తుల విషయంలో ఆశ్లోకోక్త నిషేధమునకు ప్రసక్తి ఏమి
అనగా, ఆత్మ 'సత్' అనగా భూత భవిష్యద్వర్తమాన

కాలము లన్నింటిలోను మారకుండా నిత్యముగనుండేది యని బోధించినను కంటికికనబడుట లేదు కనుక, ఒకవేళ లేదేమో యని భ్రమ పడుటకు అవకాశమున్నది కనుక అట్టి భ్రమను పొందకుండా నుండగలందులకై కనబడక పోయినను ఆత్మకు ఎప్పుడునూ అభావములేదు. అని చెప్పవలసి వచ్చినది. ఇక జగత్తు కనబడుచున్నది. కనుక సత్యమైనది అని భ్రమ పడుటకు అవకాశమున్నది. కనుక కనబడు చున్నంత మాత్ర మున జగత్తుకు ఉనికియనగా వస్తుత్వము లేదు అని బోధింప వలసివచ్చినది. అసత అంటే కుందేటి కొమ్మువలె శూన్య మని యిక్కడ అర్థముకాదు. ఎందుచేతననగా జగత్తుకనపడు చున్నదికనుక కుందేటికొమ్ము ఎవరికిని ఎప్పుడూ కనప డనే కనపడదు కనుకను అట్టిదానిని గురించి ఎవరును ఉన్న దేమో అనిభ్రమపడరు కనుక శ్రీకృష్ణుని బోధ అట్టి వస్తువు విషయమై యవసరమే లేదు. కనుక ఇప్పుడు శ్రీకృష్ణుని బోధ ఆశ్లోకములో జగత్తు కనబడుచున్నప్పటికి దానికి సత్య త్వము లేదు అనిన్ని, ఆత్మకనబడకపోయినప్పటికి దానికి అభా వములేదనిన్ని స్పష్టపడుచున్నది. దీనివల్లజగత్తుయొక్కస్వరూ పము ఏమని తెలివదనగా—"సచ్చేన్న బాధ్యేత,అసచ్చేన్న ప్రతీ యేత,తస్మాత్ జగత్ సదసద్విలక్షణంఅనిర్వచనీయం,అనగా కనబడుచున్నది కనుక "సత్" అనగాఉన్న వస్తువా అంటే నిద్రలోను, సమాధిలోను కనపడకపోవుట చేతను, ఎప్పుడూ మారుచుండుట చేతను "సత్"కాదు. పోనీ, శశశృంగమువలె "అసత్" లేని వస్తువా అంటేకనబడుచున్నది కనుక "అసత్"

కాదు అన్నారు. కనుక జగత్ సత్తుకాదు. అసత్తు కాదు అని తేలినది. ఇట్టి లక్షణమునే అనిర్వచనీయమని మిథ్య యనిన్ని అంటారు. కనుక జగత్ మిథ్య అని తేలినది. "మిథ్య" యనగా లేదని అర్థముకాదు. ఉన్నదని కాని, లేదని కాని నిర్వచించుటకు సాధ్యముకానిది యని అర్థము. ఏదిఅయితే వస్తుత్వము లేకుండా కంటికి కనపడునో అదంతయు మిథ్య యని చెప్పబడును. త్రాడునుచూచి పాము యని భ్రమపడి నపుడు వస్తుత్వములేని పాముకనబడుచున్నది. కనుక ఆపాము మిథ్య. ఇటులనే స్వప్నములో కనపడుచున్న దృశ్యమునకు వస్తుత్వము లేదు కనుక ఆదృశ్యమంతయు మిథ్యయే. ఇట్టి భ్రాంతి స్థలములలో ఒక వస్తువు ఇంకొక వస్తువుగా కన పడును. అసలు వస్తువు అధిష్ఠానమందురు; ఇంకొకటిగా కన పడిన వస్తువు ఆరోపితమందురు. అసలు వస్తువు ఎప్పుడును ఏట్టి మార్పును పొందకుండా నిర్వికారంగానే ఉండును. అట్లు మారకుండానే ఇంకొకవస్తువుగా కనపడును. భ్రాంతిపోగానే అనగా అసలువస్తువుయొక్క జ్ఞానము కలుగగానే ఆరోపితము; నశించును. జగత్తుమిథ్యయని అన్నప్పుడు జగత్తుఆరోపితము, దీనికి అధిష్ఠానము బ్రహ్మ. బ్రహ్మఏట్టిమార్పును ఎన్నడూ పొందకుండా నిర్వికారముగ ఉంటూనే జగత్తుగా భాసించు చున్నది. అధిష్ఠానమైన బ్రహ్మయొక్క జ్ఞానము కలుగగానే, జగత్తు జగత్తుగా కనపడక బ్రహ్మగానే కనపడును. త్రాడు పాముగా కనపడినపుడు త్రాడు అని ఒకవస్తువు, పాము అని ఇంకొక వస్తువు ఇట్లు రెండువస్తువులు ఎప్పుడూలేవు. భ్రాంతి ఉన్నంత కాలము పాము ఒక్కటే కనపడినది భ్రాంతిపోగానే

ఏది పాముగా కనపడినదో అదే త్రాడుగా తెలినది అనగా భ్రాంతి కాలములో అనగా అజ్ఞానదశలో పాము మాత్రమే ఉన్నది; జ్ఞానదశలో త్రాడుమాత్రమే ఉన్నది. అలాగే అజ్ఞాన దశలో జగత్తు మాత్రమే ఉన్నది: జ్ఞానదశలో యీజగత్తుగా కనపడేది బ్రహ్మగా తేలి, బ్రహ్మ ఒక్కటే ఉన్నది. అసలు వస్తువు ఎట్టి మార్పును పొందకుండా యింకొక వస్తువుగ కనబడుటను 'వివర్తము' అని యందురు. అసలు వస్తువుయింకొక వస్తువుగా వాస్తవంలో మారినపుడు, అనగా పాలు పెరుగుగా మారినపుడు, దానిని " పరిణామము " అందురు. ఇప్పుడు జగత్తుకును, బ్రహ్మలేక ఈశ్వరునకును ఉన్నసంబంధము వివర్తము కాని పరిణామముకాదు. ఇట్టి వివర్తదృష్టితోనే ఆరోపితవస్తువును 'మిథ్య' యని యందురు. ఈ విషయము "యుక్తి" అను శీర్షిక క్రింద యింకను విశదీకరింపబడును. ప్రస్తుతము గ్రంథ ప్రమాణమును గురించి పరిశీలించుచున్నాము కనుకను, యీ పరిశీలనలో కూడ "మిథ్యా" యను శబ్దమువచ్చి అది అద్వైత సిద్ధాంతమును బోధించు విలక్షణమైన శబ్దముగా ఉన్నది కనుకను దానిని గురించి యింతవరకు విచారణ గావింపబడినది.

ఇక జగత్తుయొక్క మిథ్యాత్వమును బోధించు శ్లోకములు పైనచెప్పిన ప్రకారము 2 వ అధ్యాయములోనే కాక ఇతర అధ్యాయములలో కూడఉన్నవి. వానిలో 9 వ అధ్యాయములోని 4, 5 శ్లోకములు ముఖ్యములు.

అవేవనగా;

శ్లో. "మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తి నా
మత్ స్థాని సర్వభూతాని నచాహం తే ష్వవస్థితః"
శ్లో. "నచ మత్ స్థానిభూతాని । పశ్యమే యోగమైశ్వరం"

వీని అర్థ మేమనగా —

(1) ఈ జగత్తంతయు అవ్యక్త రూపముగ నున్న నాచేత వ్యాప్తమై యున్నది.

(2) ఈభూతము లన్నియు నాయందే ఉన్నవి.

(3) నేను ఆ భూతములయందు లేను.

(4) ఆభూతములున్ను నాలో లేవు.

(5) ఇట్టి నాకు సంబంధించిన యోగశక్తిని చూడుము

పరస్పర విరుద్ధములుగా కనబడు యీ వాక్యముల భావమేమి? ఈజగత్తంతయు నాచేత వ్యాప్తమైయున్నది. అను వాక్యము బోధపడుటకు అవకాశమున్నది. కాని 'ఈ భూతములన్నియు నాయందే ఉన్నవి. నేను అభూతములలో లేను. ఆభూతములున్ను నాలో లేవు' అనువాక్యములు కేవలము పరస్పర విరుద్ధములుగానున్నవే. వీటిసమన్వయమెట్లా? యను ప్రశ్న పుట్టును. దీనికి జవాబు రజ్జుసర్పదృష్టాంతము మీాదగాని ఇంకొక విధముగా కుదరదు. రజ్జుసర్పదృష్టాంతములో పాము త్రాడుమీాద ఉండనూ ఉన్నది. త్రాడు పాము మీాద లేనూలేదు, పామున్ను త్రాడుమీాద లేదు. ఈ వాక్యములు పై 2,3,4, వాక్యములకు సరిపోవును 'త్రాడు' అనే అధిష్ఠానంఉన్నపుడేగదా "పాము" అను ఆరోపముకలిగినది

కనుక పాము త్రాడులో ఉన్నది అంటే అర్థము అట్లు తెలిసికొనవలెను. ఇకను త్రాడు వాస్తవంలో పాముగ మారలేదు కనుక 'త్రాడు పాములో లేదు" అని చెప్పబడినది. వాస్తవంలో పాముకూడ త్రాడులో లేదు కనుక పామున్ను త్రాడులో లేదు' అనిన్ని చెప్పబడినది, దార్ష్టాంతికమైన జగత్ బ్రహ్మలలో, బ్రహ్మ అను అధిష్ఠానం లేకపోతే ఆరోపము ఉండనేరదు కనుకను పై శ్లోకభావమైన 5 వాక్యములలో 2 వ వాక్యమును అట్లుఅర్థము చేసికోవలెను. వాస్తవంలో సచ్చిదానందమైన బ్రహ్మ అనృత జడదుఃఖాత్మకమైన యీ జగత్తులో ఉండుటకు వీలులేదు కనుక 3వ వాక్యమును అట్లు అర్థముచేసికోవలెను. ఇకను యథార్థస్థితిలో పాము కూడ త్రాడులో లేనట్లు ఈ జగత్తు కూడ బ్రహ్మలో లేదు కనుక 4వ వాక్యమునుఅట్లు గ్రహించవలెను. ఇట్టి ఆశ్చర్యకరమైన లక్షణము లన్నియు నాయోగశక్తి అనగా మాయాశక్తి వల్ల కలిగినవి యని తెలిసికొనుము – అని 5వ వాక్యములో శ్రీకృష్ణుడు అర్జునునికి బోధచేయుచున్నాడు. దీనివల్ల గీతబోధింపబడిన జ్ఞానము 'బ్రహ్మ ఒక్కటే సత్యమైనది. జగత్తు మిథ్య, జీవుడువాస్తవంలో బ్రహ్మమే' అను అద్వైతజ్ఞాన మని స్పష్టమగుచున్నది.
"ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం"

గీతలోని యింకొక విలక్షణమైన బోధవల్ల కూడా గీతలోని బోధింపబడిన జ్ఞానము అద్వైతమే యని ధ్రువపడును ఆ బోధఏమనగా – ఏ ఒక్కదానిని గురించి తెలిసికొంటే సర్వము తెలియబడునో అట్టిబోధ. దీనిని సంస్కృతములో

"ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం" అని అంటారు. ఇట్టి బోధ ఛాందోగ్య ఉపనిషత్తులోను ముండకోపనిషత్తులోను స్పష్టీకరింపబడి గీతలో 7 వ అధ్యాయము 2 శ్లోకములో 'యజ్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే' అని ప్రశంసింపబడినది. ఈశ్లోకమునకు పూర్వపు శ్లోకములో అనగా అధ్యాయ ప్రథమశ్లోకములో 'అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు' నా స్వరూపమును సంపూర్తిగ యెట్టి సంశయము లేకుండా నీవు ఏ విధముగ తెలిసికొనగలవో ఆ విధమును చెప్పుచున్నాను. అని చెప్పి శ్రీకృష్ణుడు 2 వ శ్లోకములో ఏ వస్తువును తెలిసికొంటే సర్వము తెలుస్తుందో ఆవస్తువును గురించి చెప్పెద' నని వాగ్దానముచేసి 'మత్తః పరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ' నాకంటె వేరుగ ఏమీలేదు అని బోధించినాడు. దీని భావమేమో పరిశీలించుదము.

ఏ వస్తువును గురించి తెలిస్తే సర్వము తెలుస్తుందో అని చెప్పుటలోని భావమును విమర్శించుటకు అసలు ఉన్న వస్తువులు యెన్ని అని ముందుగా విచారింపవలెను. ఉన్న వస్తువులు మూడు అనియు, అవి జీవుడు, జగత్తు, ఈశ్వరుడు అనియు ఈ వ్యాసమునకు శీర్షికనుబట్టిన్ని ప్రారంభ వాక్యాలను బట్టిన్ని స్పష్టమైనది గదా ! ఈ మూడిటిలోను యే ఒక్క వస్తువును గురించి తెలిసినను మిగతారెండును తెలియవలెనన్న, ఆ మూటికిని పరస్పర సంబంధ మెట్లుండవలెను ? ఆ మూడును స్వతంత్రమైన వస్తువులే అయినచో దేనిని గురించి తెలిసికొంటే అదే తెలుస్తుంది కాని మిగతావి

తెలియనేరవు. అనగా ఈశ్వరుడు లేక బ్రహ్మను గురించి తెలిసికొనిన బ్రహ్మయే తెలియబడును. కాని జీవజగత్తులు తెలియబడ నేరవు అయినచో శ్రీకృష్ణుని ఏకవిజ్ఞానేన సర్వ విజ్ఞాన ప్రతిజ్ఞ ' నెరవేరనేరదు. ఆ ప్రతిజ్ఞ నెరవేర వలెనన్న బ్రహ్మను గురించి తెలిసికొంటే జీవజగత్తులను గురించి ప్రత్యేకంగా తెలిసికొన వలసిన అవసరం లేకుండా పోవలె. అదెట్లు సంభవించు ననగా మన్నుకును, కుండకును ఉన్న సంబంధము బ్రహ్మకును జగత్తుకును వుంటే, అట్టిది సంభవించును. మన్నుతో చేయబడిన కుండలు, మూకుళ్ళు, పిడతలు మొదలైన వన్నియును మన్నుకంటె భిన్నములు కావు కనుకను, అవన్నియు మన్ను యొక్క వివిధ వికారములే కనుకను వాటికి మన్నుకంటె పృథక్ సత్తా లేదు: కుండ,మూకుడు అనునవి వాస్తవంగా ప్రత్యేకించి వస్తువులు కావు. వాటి అన్నింటిలోను ఉన్న వస్తువు ఒక్క మన్నే. అవన్నియు ఊరికే నామము. రూపము కలవే కాని, వస్తుత్వము కలవికావు. 'కారణేన అనన్యత్వాత్ కార్యస్య' అను న్యాయము ప్రకారము అవన్నియు కారణమైన మన్నుకంటె అన్యములు కావు. అట్లే జగత్తులో వస్తువులుగా కనబడున వన్నియు వాటి వాటి కారణముల కంటె అన్యములు కావు అనగా పంచభూతముల కంటె అన్యములుకావు ఆ పంచ భూతములును బ్రహ్మయొక్క కార్యములు కనుక బ్రహ్మకంటె అన్యముకావు అని తేలినది. అనగా జగత్తుకు బ్రహ్మకంటె వేరైన వస్తుత్వము లేదని తేలినది. దీనినే మిథ్యాత్వ మంటారు.

కనుక జగత్తు మిథ్య అని ఈవిధముగా కూడా తేలినది. ఇది అద్వైత సిద్ధాంతమే కదా! ఇంకను, జీవుడుకూడ బ్రహ్మకంటె భిన్నుడైనచో బ్రహ్మను గురించి తెలిసికొన్నచో జీవుని గురించి తెలియబడ నేరదు. అట్లయినచో 'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ' నెరవేర నేరదు. ఆ ప్రతిజ్ఞ నెరవేరవలె ననిన జీవుడు బ్రహ్మకంటె భిన్నుడు కాకుండా ఉండాలె. వాస్తవంలో బ్రహ్మకంటే ఆయా ఉపాధుల సంబంధము కలిగేటప్పటికి జీవుడు అని పిలువబడు చున్నాడు కాని, జీవుడు వేరేలేడని ఉపనిషత్తులు ఘోషించు చున్నవి, ఘటాకాశము మహాకాశము కంటె భిన్నము కానట్లు జీవుడును బ్రహ్మకంటె భిన్నుడు కాడు అని తేలుచున్నది. అట్టి పరిస్థితుల లోనే బ్రహ్మను తెలిసికొంటే జీవుడు వేరే వస్తువు కాదు. కనుక జీవుని గురించి వేరే తెలిసికొన వలసిన అవసరము లేకుండా జీవుడుకూడా తెలియబడును. ఇట్లు గీతలో చేయబడిన "ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ" వల్లకూడ గీతలోని జ్ఞానబోధ అద్వైతమే యని స్పష్టమగు చున్నది.

**జీవన్ముక్తి:**

ఇంకొక విలక్షణమైన బోధవల్లకూడా గీతలో అద్వైత జ్ఞానమే బోధింప బడినదని స్పష్టమగును. అది జీవన్ముక్తిని గురించిన బోధ. జీవన్ముక్తి యనగా జీవించి యుండగానే ముక్తిని అనుభవించుట. మామూలుగా ముక్తి యనగా దేహము నశించినతరువాత జీవుడు పొందు స్థితియని ద్వైత విశిష్టాద్వైత మతముల వారి సిద్ధాంతము. అద్వైత సిద్ధాంతము ప్రకారం మాత్రము మానవుడు ఈ భౌతిక దేహ

ములో ఉండగానే ముక్తుడు కావచ్చును, ఈ జీవన్ముక్తి సిద్ధాంతము ఒక్క అద్వైతమతములోనే ఉన్నదికాని ఇతర మతములలో లేనేలేదు. అట్టి సిద్ధాంతమును గీత అనేకచోట్ల స్పష్టముగా వ్యక్తపరచినది.

'ఇహైవతైర్జితస్సర్గః యేషాం సామ్యేస్థితం మనః"
('ఇహ' అనగా ఈ శరీరములో నుండగనే అని అర్థము.)
'శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీర విమోక్షణాత్'
'అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనాం' 'యదా భూత పృథగ్భావం ఏకస్థ మను పశ్యతి! తతఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా' — ఈ మొదలైన శ్లోకములు జీవన్ముక్తిని స్పష్టముగ బోధించు చున్నవి. జీవన్ముక్తుడనగా ఈ శరీరములో జీవించి యుండగనే, బ్రహ్మసాక్షాత్కారము పొంది ముక్తిని పొందినవాడు యనిగదా అర్థము.

అట్టివానినే "తత్త్వదర్శి" యనియు గీత వర్ణించినది. 'తత్త్వదర్శి' అనగా తత్త్వమును సాక్షాత్కరించిన వాడని అర్థము. అట్టివారే గురువులుగ నుండదగినవారు.

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తేజ్ఞానం జ్ఞానినః తత్త్వదర్శినః"

అను శ్లోకములో గురువులు అనగా జ్ఞానులు, తత్త్వదర్శులు అని వర్ణింపబడినది. జ్ఞానులు అనగా శాస్త్రజన్యతత్త్వజ్ఞానం కలవారు అని యర్థము. తత్త్వదర్శులు అనగా తత్త్వ సాక్షాత్కారం అంటే అనుభవజ్ఞానం కల వారని యర్థము. గురువుగా ఉండవలసిన వానికి శాస్త్రజన్య జ్ఞానము ఉండాలె, అనుభవజ్ఞానము ఉండాలె. ఎందు కనగా—

శాస్త్రజ్ఞానము లేకపోయినయెడల శిష్యులకు బోధచేయలేడు. అనుభవజ్ఞానము లేకపోయినయెడల తత్త్వమే సరిగా తెలిసికొనలేడు. ఎవరికి వారు తరించేటందుకు అనుభవజ్ఞానము, అనగా ఆత్మసాక్షాత్కారము చాలును. కాని ఇతరులను బోధచేయు గురువుగా ఉండవలెనంటే శాస్త్రజ్ఞానము కూడా ఉంటేనే కాని బోధచేయు సామర్థ్యము ఉండనేరదు. అందుకని గీత పై శ్లోకములో ఆ రెండు లక్షణములను చెప్పిన్నది. కనుక గీతాసిద్ధాంతము ప్రకారం అద్వైతులే ఉత్తమ గురువులుగా నుండదగినవారు. కాని ద్వైత విశిష్టాద్వైతులు అట్టి గురువులుగా నుండ నర్హులు కారని తేలుచున్నది. ఎందుకనగా వారి సిద్ధాంతము ప్రకారం దేహము నశించినతర్వాత ముక్తియే కాని జీవన్ముక్తి లేదు గనుక పాశ్చాత్యులలో కూడా వేదాంతజ్ఞానము కలవారిని 'Thinkers' అనగా బుద్ధికుశలత కలవారని అంటారే కాని, మన అద్వైతులలో వలె 'Seers' తత్త్వదర్శులని యనరు. కనుక లోకమున కంతకును ఆధ్యాత్మిక విషయములలో ఉత్తమ గురువుగా నుండదగినవాడు ఒక్క అద్వైతి మాత్రమే. ఇతరులెవరును కాజాలరని స్పష్టపడుచున్నది. బ్రహ్మ ఒక్కడే సత్యమయిన వస్తువు. జీవుడు బ్రహ్మకంటే భిన్నుడు కాడు. జగత్తు బ్రహ్మకంటె అన్యం కాదను అద్వైత సిద్ధాంతములో జీవుడు సర్వవ్యాపకమయిన బ్రహ్మమే కనుక యీ జీవన్ముక్తి సాధ్యపడును. మిగతా మతములలో అట్టిది లేనే లేదు. అట్టి జీవన్ముక్తిని గీత బోధించుటవలన గీతలోని జ్ఞాన సిద్ధాంతము అద్వైతమే అని నిర్ధారిత మగుచున్నది. ఇట్లు

భగవద్గీతా సందేశము ప్రధానముగా జ్ఞానమే కాని కర్మ భక్తి కాదనియు, ఆ జ్ఞానము అద్వైతాత్మక జ్ఞానమే యనియు అట్టి జ్ఞానోదయమునకు సహాయకములు స్వధర్మానుష్ఠాన కర్మ, అనన్యభక్తి సాధనము లనియు తెలిసెను.

## ఉపనిషత్తులు

జగజ్జీవేశ్వరుల తత్త్వము భగవద్గీతలో ఎట్లు నిర్ధారణ గావింపబడినదో మనము పరిశీలించినాము. ఆ తత్త్వము ఉపనిషత్తులలో నెట్లు వర్ణింపబడినదో ఇంకను చూడ వలసి యున్నది. ఉపనిషత్తులు అనగా వేదములకు అంతిమ భాగములు, కనుకనే వానిని వేదాంతములనియు అందురు. వేద శబ్దార్థము 'వేదయతీతి వేదః' అనగా తెలియ చేయునది కనుక వేద మని తెలుపుచున్నది. తెలియ జేయునదనగా దేనిని? మానవునకు ప్రత్యక్ష ప్రమాణము చేతగాని, అనుమాన ప్రమాణము చేతగాని తెలిసికొనుటకు సాధ్యము కాని విషయములను తెలియచేయును కనుక వేదమని యర్థము. ఇట్టి వేదమునకు స్వరూప స్వభావము లేవి యని విచారించినచో వేద మపౌరుషేయము, అనాది, నిత్యమని చెప్పబడుచున్నది. అపౌరుషేయ మనగా పురుషుని చేత రచింపబడినది కాదని యర్థము. కనుక వేదము పురుష నిర్మితము కానందున కర్త లేదనియు, అనాది యగుటచేత ఫలాన కాలములో పుట్టినదనుటకు వీలు కానిదనియు, నిత్యమగుట చేత మారునది కాని నశించునది కాని కాక సర్వకాలములకు సర్వులకు నిత్యమైన ప్రమాణరాజమనియు తెలుపుచున్నది. ఇట్లు చెప్పుటకు ప్రమాణ మేమి యని మీమాంస జేయు

నము. ఏ గ్రంథమునకైనను కర్తను గురించి కాలమును గురించి స్వరూప స్వభావములను గురించి విచారణ చేయ వలెననిన, పాశ్చాత్య విమర్శనా పద్ధతుల ప్రకారము కూడ, ఆ గ్రంథములోని (internal) విషయ పరిశీలన ఒకటిన్ని, ఇతర ప్రాచీనతమ గ్రంథములలోని (external) విషయ పరిశీలనము రెండవదిన్ని యను రెండు విధములుగ నున్నది. అట్టి పద్ధతుల ననుసరించి చూచినచో వేదములోని (internal) భాగములున్ను, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు, సూత్రములు మున్నగు (external) సంస్కృత వాఙ్మయమంతయున్ను, వేదములు ఆ పరమేశ్వరుని ఉచ్ఛ్వాస, నిశ్వాస రూపములనిన్ని, వానికి కర్త లేక పోవుటే కాక పరమేశ్వరుడు కూడా కర్త కాక అభివ్యంజకుడు మాత్రమే యనిన్ని, అవి అనాదులు నిత్యములు అనిన్ని, పరమేశ్వరుడు బ్రహ్మదేవుని పుట్టించి సృష్టిని చేయుమని ఆజ్ఞాపింపగా, 'నేనిదెట్టి ఏవిధముగా చేయుదును' అని బ్రహ్మ అడుగగా అతనికి ఆ పరమేశ్వరుడు తనలోనున్న వేదరాశిని ప్రకటపరిచాడనిన్ని, అంతట అట్టి వేదముల సహాయమువల్ల బ్రహ్మదేవుడు సృష్టి చేసినాడనిన్ని స్పష్టమగుచున్నది. దీని వలన వేదములు సృష్టికిని, సృష్టి కర్తయైన బ్రహ్మదేవునికి కూడ పూర్వమే ఆ పరమేశ్వరునిలో ఉన్నవని తేలుచున్నది. ఎవని కైనను ఉచ్ఛ్వాస నిశ్వాస అనునవి సహజమే కాని పురుషనిర్మితము కాదు గదా! కనుకనే పరమేశ్వరుని నిశ్వాసమైన వేదమున్ను పరమేశ్వర కర్తృకముకూడ కాక పరమేశ్వరునితో పాటు నిత్యముగా నుండునదని స్పష్టమగుచున్నది.

ఇంకను వేదము లోని విషయములను పరిశీలించిన యెడల అవి మానవమాత్రునికి ఏ ప్రమాణము చేతను, ఎప్పటికిని తెలియుటకు వీలులేని స్వభావము కలవి అగుటచేతను కూడ ఏ మానవుడును ఎప్పుడును రచించుటకు వీలులేదనిన్ని, స్పష్టమగును. అట్టి విషయము లేవనగా, పైన ఏడు లోకములున్నవనిన్ని, క్రింద ఏడు లోకములు ఉన్నవనిన్ని ఆ యా లోకములలో, నానా విధములు జీవులు ఉన్నారనిన్ని, వారి చరిత్రలను గురించిన వచనములు, సృష్టికి పూర్వపు పరిస్థితులు, సృష్టి పుట్టిన విధానము, జీవులు పుట్టిన విధానము, ఈశ్వర స్వరూపము, జీవుని స్వరూపము, జగత్స్వరూపము గర్భస్థశిశువు భావించు విషయములు, చనిపోవు సమయములో జీవుని గొప్ప అనుభవములు, దేవతలలో ఎవరికి ఎవరు పురోహితులైనది. వారిలో వారిపరస్పర సంబంధము, పక్షులకు రాత్రిళ్లు భూమి ఎల్లు కనపడునను విషయము మున్నగు ననేక విషయములు మానవుడు తెలిసికొనుటకు ఎన్నటికిని సాధ్యము కానివై యున్నవి.

ఇట్టి పరిస్థితులలో 3000 బి.సి. ప్రాంతముల బుద్ధిమంతులు వేదములను వ్రాసి యుండవచ్చు ననిన్ని, ఆ వేదములలో కూడ ముందు మంత్రభాగమే పుట్టినదనిన్ని, ఆ తరువాత కొంత కాలమునకు బ్రాహ్మణభాగము, ఆ తరువాత ఆరణ్యక భాగము, ఆ తరువాత 1500 బి. సి. ప్రాంతముల ఉపనిషత్తులు పుట్టినవని, ఈ విధముగా మన భారతీయ ఆర్ష వైదిక సంప్రదాయమును ఎరుగని పాశ్చాత్యులు ఊహాగానమును చేయగా, మన భారతీయనవనాగరికులు పైన చెప్పిన

ప్రకారము సంస్కృత వాఙ్మయ మంతటిలోను దేదీప్యమాన ముగ విరాజిల్లుచున్న ప్రమాణములను త్రోసిపుచ్చి పాశ్చాత్యుల ఊహాగానమును ప్రధానముగా చేసికొని విశ్వసించి వ్యక్త పరచుట చాల శోచనీయము కాదా !

ఇంకను మంత్ర బ్రాహ్మణ ఆరణ్యక ఉపనిషత్తు లన్నియు కలసి వేదమని గ్రంథము లన్నియు ఘోషించు చుండగా ఒకదాని తరువాత ఒకటి పుట్టినదని వానికి వివిధ కాలములను నిర్ణయించుట ఎంతటి అవివేకము ! ఎంతటి సాహసము! వ్యాసభగవానుడు వేదము లన్నిటిని ఒకేరాశిగ నుండగా ఋగ్యజుస్సామాధర్వములుగా విభజించినాడనియు అందుకనే "వ్యాసః" అని బిరుదము యివ్వబడిన దనియు, (వ్యాసః అనగా విభాగము చేసినవాడు) ఇట్లుమన ప్రాచీన గ్రంథములు చాటుచుండగా, ఒక భాగము తరువాత ఒక భాగము కాలాంతరములో పుట్టినదని భావించుట బుద్ధిమంతుని లక్షణమా ? ద్వైతాద్వైత మతప్రవక్తలగు శ్రీమతాచార్యులును వేదములు అపౌరుషేయములు, నిత్యములు అని వక్కాణించు చుండగా పాశ్చాత్యులు వేదములు 3000 బి. సి. లో రచింపబడి యుండవచ్చును అని నిశ్చయించు చున్నారే. ఏమి ఆశ్చర్యము !

వేదము గ్రంథము కనుక ఎవరో ఒకరు వ్రాయకుండా ఎట్లు ఏర్పడునని ప్రశ్నపుట్టును. వేదము రచింపబడిన గ్రంథమని మన సిద్ధాంతమేకాదు. అది శ్రుతి. అనగా వినబడిన శబ్దరాశి. పరమేశ్వరుని ద్వారా వచ్చిన శబ్దరాశిని బ్రహ్మదేవుడు విన్నాడు. ఆయన తిరిగి ఆశబ్దరాశిని ధారణ

చేసి మహర్షులకు శ్రుతపరిచినారు మహర్షులయొద్దనుండి నేటి వరకును యీ పవిత్ర భారత దేశంలో ఈ శబ్దరాశి దేదీప్యమానముగ గురు శిష్య పరంపరలో విరాజిల్లుచున్నది. కనుక మన భారతీయ సంప్రదాయానుసారముగ వేదములు అపౌరుషేయములు, నిత్యములు అని ధ్రువపడుచున్నది. అట్టి వేదములు అనంతములు వాని చివర భాగములు ఉపనిషత్తులు 'ఉపనిషత్తు' అను శబ్దమునకు అజ్ఞానమును పోగొట్టు బ్రహ్మవిద్య అని అర్థము. ఇంకను "ఉప" అనగా గురుని సమీపములో కూర్చుని అంతరంగికముగా తెలిసికొనదగిన రహస్యమైన విద్య అనియు ఆ శబ్దార్థము. జీవుని జనన మరణ ప్రవాహములో నుండి లేవనెత్తి జన్మరాహిత్యమును చేసి ముక్తి నిచ్చు పవిత్రతమ గ్రంథమగుటచేత ఉపనిషత్తులకు ప్రపంచములో నఖండ ప్రశస్తి వచ్చినది. పాశ్చాత్య విజ్ఞాన తేజోరాశులగు "స్కోపెన్ హార్" మున్నగు వారు ప్రపంచములో ఉపనిషత్తులవంటి ఉత్తేజకరమగు గ్రంథ మింకొకటి లేదనియు దానిలోనున్న విజ్ఞానము ఏ యితర గ్రంథములలోను లేదనియు అవిఅత్యుత్తమమైన విజ్ఞానపేటికలనియు ఎంతయో ప్రశంసించి, ఆ ఉపనిషత్తులను చదువకుండా ఎన్నడూ నిద్ర పోలేదనియు నుడివినారు.

అట్టి మహోత్కృష్టమైన ఉపనిషత్తులు నాలుగు వేదములలోను కలసి 1180 ( ఋగ్వేదములో 21. యజుర్వేదములో 109, సామవేదములో 1000. అథర్వణ వేదములో 50) ఉన్నవి. వానిలో నుంచే శ్రీరామచంద్రమూర్తి తన ముఖ్య భక్తుడున్ను శిష్యుడున్ను అయిన హనుమంతునికి

108 ని వరి ఉపదేశించి నాడనిన్ని; అందుచేత ఆ 108 ఉపనిషత్తులు ఇప్పుడు అములులో నున్నవనిన్ని తెలియుచున్నది. ఈ 108 లోను 10 ఋగ్వేదమునకు సంబంధించినవి. 19 శుక్ల యజుర్వేదమునకు చెందినని. 32 కృష్ణ యజుర్వేదమునకు చెందినవి. 16 సామ వేదమునకు చెందినవి 31 అధర్వణ వేదమునకు సంబంధించినవిన్ని అయ్యున్నవి. 108 లోను ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య తైత్తిరీయ ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యములను పదియును ముఖ్యముగ పరిగణింపబడి త్రిమతాచార్యుల చే రచింపబడిన భాష్యముల చే నొప్పుచున్నవి. ఈ పది ఉపనిషత్తులలోను ఐతరేయము ఒక్కటే ఋగ్వేదమునకు చెందినదిన్ని, ఈశావాస్య బృహదారణ్యకములు రెండున్ను శుక్ల యజుర్వేదమునకు చెందినవిన్ని కఠ తైత్తిరీయములు రెండున్ను కృష్ణ యజుర్వేదమునకు చెందినవియు, కేన, ఛాందోగ్యములు రెండును సామవేదమునకు చెందినవియు ప్రశ్న; ముండక, మాండూక్యములను మూడున్ను అధర్వణ వేదమునకు చెందినవియు అయ్యున్నవి.

ప్రతి ఉపనిషత్తులోను మామూలు వాక్యములకు తోడుగా కొన్ని మహావాక్యములున్నవి. 108 ఉపనిషత్తులలోనుంచి శ్రీరామచంద్రమూర్తి తనపట్టాభిషేకములో తనకు మహోపకారము గావించిన హనుమంతునికి 1008 మహావాక్యములను వరి ఒకమాలగా ఉపదేశించి యిచ్చినాడు అని ఒక గాధకలదు. అదినిజమైనను కాకపోయినను 108 ఉపనిషత్తులలోనుంచి 1008 మహావాక్యములు ఉద్ధరింపబడిన

సంగతి నిజము. వానికి మహావాక్య రత్నావళి అని పేరు కలదు. ఈ 108 ఉపనిషత్తులను గాని, 1008 మహావాక్యములను గాని చదువుటకు ఓపిక లేనివారికి వాటి అన్నిటికి సారభూతముగ నాలుగు మహావాక్యములను నాలుగు వేదముల నుండి ఏరి మనయందుంచు అత్యంత దయతో మనకు అందించినారు.

జగజ్జీవేశ్వరుల తత్త్వనిర్ణయమునకై ముందు మహావాక్య విచారణ చేసి ఆ తరువాత ఇతర వాక్య విచారణ చేయుదము.

## మహావాక్య విచారణ

మహావాక్యమనగా జీవునికని, బ్రహ్మకునుగల సంబంధమును, జగత్స్వరూపమున్ను అనగా జగజ్జీవేశ్వరుల అన్యోన్య సంబంధమును తెలియ చేయునది అయ్యున్నది. 1008 మహావాక్యములలోను 38 మహావాక్యములు జీవునికిని బ్రహ్మకునుగల సంబంధము అభేదమని తెలియ చేయును. 33 మహావాక్యములు జగత్తుయొక్క మిథ్యాత్వమును బోధ చేయును. 93 మహావాక్యములు బ్రహ్మయొక్కటే సత్యమైనదని బోధించును. మిగతా వాక్యములు బంధమోక్షములను గురించి జీవన్ముక్తిని గురించి, మననమును గురించి ఈ మొదలగు విషయములను గురించి బోధించునవై యున్నవి. అన్ని వేదముల సారముగ నాలుగు మహావాక్యములను నాలుగు వేదములలోనుంచే మనకు అనుగ్రహించినారు. కనుక ఆ నాల్గు మహావాక్యముల విచారణ గావించుదము. ఈ నాలుగు

మహావాక్యములు జీవబ్రహ్మైక్యభేదమును బోధించునవై యున్నవి. అవెవ్వి యనగా !

తత్త్వమసి (సామవేదము)

అయమాత్మా బ్రహ్మ (అథర్వణవేదము)

అహం బ్రహ్మాస్మి (యజుర్వేదము)

ప్రజ్ఞానం బ్రహ్మ (ఋగ్వేదము)

ఈనాలుగున్ను ఉపనిషత్తులలో ఉపదేశింపబడునవై యున్నవి. ఈ నాలుగున్ను ప్రత్యేక ప్రత్యేకముగా మోక్షమును ప్రసాదించునవే అయియున్నవి. అయినను వీనిలో నొక క్రమముకూడ ఉన్నట్లు గోచరించుచున్నది. మొదటి మహావాక్యము 'తత్త్వమసి' అనునది, 'నీవు బ్రహ్మము' అని గురువు శిష్యునికి బోధచేయునదై యున్నది. ముముక్షువు అయిన శిష్యుడు తరించుటకుగాను శ్రవణ, మనన, ధ్యానములను సాధనములను చెప్పినారు కనుక, అట్టి శిష్యుడు గురువు యొద్ద మొదట ఈ మహావాక్యము శ్రవణము చేయును. కనుక ఈ మహావాక్యము శ్రవణ మహావాక్యము. ఇట్లు శ్రవణము చేసిన తరువాత దీని భావమును మననము చేయవలెను కనుక, 'అయమాత్మా బ్రహ్మ' అను మహావాక్యముతో ఆ ముముక్షువు తన హృదయాకాశములోనున్న ఆత్మను తన చేతితో చూపుచూగాని లేక భావన చేయుచూగాని "అయమాత్మా" ఈ ఆత్మయే, 'బ్రహ్మ' బ్రహ్మము అని మననము చేయును. కనుక, ఇది 'మనన మహావాక్యము" ఇట్టి మననమువలన విషయము నిశ్చితమగును కనుక, అట్టి నిశ్చితభావమును 'అహం బ్రహ్మాస్మి' 'నేను బ్రహ్మనే' అని

ధ్యానముచేయుచు. కనుక ఇది ధ్యానమహావాక్యము" ఇట్లు 'ధ్యానములో పరినిష్ఠుడు కాగానే, తన వ్యక్తిత్వము పోయి, తనలోనున్న చైతన్యము మాత్రమే బ్రహ్మకాదు, సర్వత్రఉన్న 'చైతన్యమంతయు బ్రహ్మమే' అను సమష్టి భావముకలిగి సత్య జ్ఞానానందమై సర్వ వ్యాపకమైన బ్రహ్మానుభవము కలిగితరించును. కనుక, 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనునది అనుభవ మహా వాక్యము. ఈ మహావాక్యమునకు అర్థము చైతన్యమంతయు బ్రహ్మయే అని.

ఇట్లు గురువు 'నీవు బ్రహ్మమువు' అని శిష్యునికిబోధ చేయగా, 'ఈ ఆత్మ బ్రహ్మ' అని తనలో తను మననము చేసికొని, నిశ్చయించుకొని, 'నేనుబ్రహ్మనే' అని విజాతీయ ప్రత్యయములేకుండా అవిచ్ఛిన్నము,గాధ్యానం చేసినమీాదట నాలోని చైతన్యమేకాదు, సర్వత్ర ఉన్నచైతన్య మంతయు బ్రహ్మయే అని సర్వాత్మ భావ అనుభవము కలిగి ముక్తు డగుట అని తేలుచున్నది. ఇంకను ఇంకొక స్వారస్యమున్న కలదు. మొదటి శ్రవణ మహావాక్యము 'తత్త్వమసి' అను నది మధ్యమ పురుష [Second Person] లో ను న్న ది. 'అయమాత్మా బ్రహ్మ" అనుమనన మహావాక్యము ప్రథమ పురుష (Third Person) లో నున్నది. 'అహంబ్రహ్మాస్మి' అనుధ్యాన మహావాక్యము ఉత్తమపురుష (First Person లోనున్నది. ఇకను 'ప్రజ్ఞానంబ్రహ్మ' అను అనుభవమహా వాక్యము ఏపురుషలోను లేకుండా (Impersonal) సామాన్య వాచకముగా సర్వమునకు సంబంధించియున్నది. ఇట్లు మహా వాక్యము లన్నియు జీవ బ్రహ్మైక్యమును బోధించుట చేత

అద్వైతమునే ఉపనిషత్తులు బోధించు చున్నవని తేలు చున్నది. ఇంకను 'బ్రహ్మ సత్యం' జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాపరః అను అద్వైత సిద్ధాంతములో (1) బ్రహ్మ ఒక్కటే సత్యమైనది. (2) జగత్తు మిథ్య (3) జీవుడు వాస్తవముగా బ్రహ్మయే అను మూడు లక్షణములలోను ఏ ఒక్కటి ఋజువు అయినను మిగతా రెండును ఋజువు అయి నట్లె తేలును. ఒక్క జగన్మిథ్యాత్వము తేలినను, ఒక్క జీవ బ్రహ్మైక్యము తేలినను, ఒక్క బ్రహ్మ సత్యత్వము తేలి నను, మిగతావి అన్ని తేలి అద్వైత్వ సిద్ధాంతము నిర్ధారిత మగు చున్నది.

## ఉపనిషత్తులలోని ఇతర వాక్యములవిచారణ

1. ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ : జగజ్జీవేశ్వరు లలో ఏ ఒక దాని తత్త్వము తెలిసినను మిగతా రెండును తెలియబడును అను సిద్ధాంతము విషయమై భగవద్గీతను గురించిన మీమాంసలో మనము పరిశీలించినాము. ఈ సిద్ధాంతము ఉపనిషత్తులలో విపులముగ ప్రశంసింప బడినది,

ఛాందోగ్యోపనిషత్తులో —

'యేనాశ్రుతం శ్రుతంభవతి, అమతం మతం, అవి జ్ఞాతం విజ్ఞాతం' అనినిన్ని,

ముండకోపనిషత్తులో —

' కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతి, అనినిన్ని

బృహదారణ్యకోపనిషత్తులో

